ద్రకర్మము చేయునో వాని యాత్మను వాఁడే చంపుకొనుచున్నాఁడు. తండ్రియందు రాజ్యభారమున్న రాజపుత్రులే ధన్యులు. సుఖము కలుగఁజేయని సంపద యెందుకు. అధికవ్యాసంగము పండలకొలఁది దుఃఖములను కలిగించును. అఫలారంభము లెవ్వనికి సుఖావహములు? లాతివారి పొలము దున్నిన ఫలమేమి. దానిపంటకు క్షేత్రాధికారియే యధికారిగదా? కొడుకులు, తమ్ములు, సవతితమ్ములు, పినతండ్రులు, జ్ఞాతులు, దౌహిత్రులు, నాగంతుకులు, వీరియందు దాయప్రాప్తియెడల నొకన్నిటికంటె నొకరు తక్కువవారు. ఎండిపోయిన మొగము, నల్లని మొగము, పలువిధములగు వాక్కులు, మిగుల చెమటపట్టుట, మాటిమాటి కావలించుట, శరీరకంపము తొట్రుపాటు. వాహ్యాక్రోశకణము, ఆవేగము, పరిభూమినివాసము, ననునివి దుష్కృతము చేసిన రాజునకును చేయుచున్న రాజునకును చేయఁబోవు రాజునకును లక్షణములు.

## 25 దివసానుష్ఠానసముద్దేశము.

బ్రహ్మముహూర్తమున లేచి చేయఁదగినకార్యము లాలోచింపవలయును. సుఖనిద్రచే సుప్రసన్నమగు మనంబున యాదార్థములగు సర్వబుద్ధులను బ్రతిఫలించును. ఉదయసంధియు సాయంసంధియు ధర్మకార్యాలోచనలోఁ గడపవలయు. ఉదయమున లేచినవెంటనే తన మొగము నాజ్యమందుం గాని యద్దమందుం గాని చూచుకొనవలయును లేచినవెంటనే నపుంసకుని వికలాంగుని రజస్వలాంగనను గనరాదు. సంధ్యాకాలములయందు శుచియై జపించువానిని దేవతలనుగ్రహింతురు, నిత్యతముగా దంతధావనముఁ జేసికొనినంగాని ముఖశుద్ధికాదు, శారీరకకృత్యములకంటె నితరకార్యవ్యాసంగ ముఖ్యపదికాదు. వేయియుగములు కాచుకొనియున్నను తరంగములులేని సాగరమున స్నానము దొరకునా! వ్యాయామనిద్రాస్నానభోజన స్వచ్ఛందవృత్తికాలములను నితరకార్యవ్యాసంగంబునఁ నతిక్రమింపరాదు. శుక్రమును మలమూత్రములను నిశ్వాసమును బ్రతిబంధించుటవలన నశ్మరీభగంధరాది రోగములు తటస్థించును గంధలేశమేనియు లేకుండునట్లుగా మృత్తికచే శౌచవిధి చేయవలయును బహిర్దేశమునకుం బోయినవెనుక నాచమనముఁ జేయకుండ గృహప్రవేశముఁ జేయరాదు, దేహమునకు వ్యాయామము రసాయనకల్పమైనది. క్షయరోగికి నజీర్ణరోగికి వాతరోగికి నధికభోజికిని వ్యాయామము పనికిరాదు శరీరాయాసకారియగు క్రియకు వ్యాయామమని పేరు దేహమునకుఁ జెమ్మటపట్టు పర్యంతము వ్యాయామముఁ జేయవలయునని శుక్రాచార్యులు చెప్పిరి. శాస్త్రవాహనాభ్యాసంబున వ్యాయామము సఫలముఁ జేయవలయును తనబలము నతి

క్రమించిన వ్యాయామమువలన సర్వాపదలు జనించును, వ్యాయామము చేయనివారికి జఠరాగ్ని దీపనముగాని యుత్సాహముఁగాని దేహదార్ఢ్యముగాని కలుగదు. ఇంద్రియాత్మ మనస్సులకు సూక్ష్మావస్థయె నిద్ర నాఁబడు, సుఖనిద్రఁ జెందినవారికింద్రియములు సుప్రసన్నములగు, పగలు పదియవభాగంబున నిత్యము స్నానమాచరింపవలయును ధర్మార్థకామములయందు శుద్ధిలేనివారినిఁగాని దుర్జనులంగాని స్పృశించినచోఁ దప్పక స్నానమాచరింపవలయు. శ్రమ చెమ్మట మాంద్యము నివిపోవుటయే స్నానమునకుఫలము. దేవగురు ధర్మోపాసనములులేనిస్నానము జలచరస్నానము వంటిది. ఆకలియుఁ దప్పియుఁ గొన్నతఱి నభ్యంగస్నానముఁ జేయరాదు. ఆతపతప్తుని జలావగాహనము మాంద్యంబును దలనొప్పియు ఘటించును. ఆకలియగు తఱియే భోజనకాలము. ఆకలిలేనితఱిఁదిన్న యమృతము విషమగు, జఠరాగ్నిని వజ్రాగ్నిఁగావించువానికి జీర్ణదోషముండదు. అన్నముఁదినక ద్రవద్రవ్యముపయోగించువారి జఠరాగ్ని నశించును. ఒక్కసారి యెక్కువనీరు త్రాగువారికిని జఠరాగ్ని నిలువదు ఆఁకొన్నతఱిని దినకున్న నన్నద్వేషమును దేహపరిశ్రమంబును గలుగును ప్రదీప్తమగు నగ్నియందేది యింధనము కాదు ఎవఁడుమితభోక్త కాఁడో వాఁడు సర్వాపదలు భుజించును. విరుద్ధమైనదియుఁ బరీక్షింపఁబడనిదియుఁ జక్కఁగా నుడకనిదియు రుచిరానిదియు నగునన్నము తినరాదు అకాలమందును దినరాదు. అల్పభోక్తను ననుకూలుని నాకలిఁగొన్నవానిని నతిథియుని భోజనకాలమున దగ్గఱనుంచుకొనరాదు. పంక్తియందున్నవారందఱితో సమానముగ భుజింపవలయును గాని వెనుకఁబడరాదు. సాయంకాలమున కాఁకలిగాకుండ ద్వివారభోజియు మఱునాఁటియుదయమున కాఁకలిగాకుండ నేకవారభోజియు భుజింపరాదు. అంతియేకాని భుక్తిపరిమాణము విషయమయి యింతయని సిద్ధాంతములేదు. ఎంతజీర్ణమగునో యంతయే భుజింపనగు. అపరిమితభోజి దేహమునకును జఠరాగ్నికిని నాపదఁదెచ్చిపెట్టుకొనును. దీప్తమగు నగ్నికిం దగినంత భుజింపకుంటయు ననారోగ్యకారణమే! అతిభోజికన్న పరిణామము దుస్తరము. శ్రమార్తునకు భోజనంబును పానంబును జ్వరము దెచ్చును. పానీయమునకుం దగినంత వెలితిగా భుజింపఁదగు. భుజించినవెంటనే వ్యాయామము గాని మైథునము గాని సర్వోపద్రుతికిఁ గారణములు, అలవాటయినచో విషమునైతము పథ్యమగును. అలవాటులేకపోయినను బథ్యవస్తువుం దినవచ్చుం గాని యభ్యస్తమైనదు నపథ్యముఁదినరాదు. బలవంతునకు సర్వము పథ్యమేయని తలఁచి కాలకూటముఁ దినరాదు ఎంతశిక్షితమైనను నభ్యస్తమైనను నొకానొకసమయంబున విషము చంపఁగలదు. అనభ్యస్తమైనను నమృతమన్నఁ జంపదు. ఆగంతులకు నతిథులకును నాశ్రితు

లను విభజించి యొకటి తక్కినయది మెసంగవలయు. దేవుని గురువును ధర్మంబును సేవించువాఁడు కుటిలమతి గాఁడు. మనోనిరోధము సర్వేంద్రియములను బంధింపఁ జేయును. పురుషులకు స్వతంత్రవృత్తి పరమౌషధము. స్వచ్ఛందచారులగు నేనుగులు కాననములందే రోగమును లేకుండ జీవించుచున్నవి కదా! సరసమగు స్వేచ్ఛాలాపమొకటియుఁ దాంబూలభక్షణ మొకటియు నీరిదే సర్వకాలము సేవించుచున్నను సుఖముఁ గలుగఁజేయునవి. చిరకాల మెత్తగు ప్రదేశమున నిలుచున్నచో రక్తము ప్రవహించు నాడులు శిథిలములగును. చిరకాలము కూర్చున్నచో జఠరాగ్ని మందమగును. మనసు స్థూలమగును. వాక్కు ముద్దయగును. శరీరమునకు బొంద పెరుగును. శరీరమునకు విస్తారముగాఁ జెమ్మటపట్టించినచో శీఘ్రకాలములోనే ముదిమివచ్చును. దేవగేహములను దేవశూన్యములం జేయరాదు. దేవుఁడు గురుఁడు ధర్మువు లేనివానియందుఁ బ్రీత్యయనుండరాదు. క్లేశకర్మవిపాకాశయపరామృష్టుఁడు కాని పురుషవిశేషమె దేవుఁడు, అర్హన్, అజః, అనంతః, శంభుః, బుద్ధః, తమోంతక యను విశేషనామములా దేవునికే కలవు ఆత్మసుఖమున కవరోధము కలుగకుండ రేఁబవళ్లు విభజించి సర్వకార్యములు నెరవేర్చుకొనుచుండవలెను. ఏకార్యమునకును కాలనియమము లేకుండరాదు. కాలనియమములేని కార్యము మరణసమానము ఆత్యంతిక కార్యములకుఁ గాలనియమము పనికిరాదు. అవశ్యకర్తవ్యమగు కార్యమునకుఁ గాలయాపన చేయరాదు. రా జాత్మరక్షణమునందెన్నండు నేమఱియుండరాదు ప్రతిదినము సవత్సయగు ధేనువునకుం బ్రదక్షిణము జేయకుండ ధర్మాసనమెక్కరాదు. అధికారి గానివాఁడుగాని పిలువఁబడనివాఁడుగాని రాజసభకుఁ బోరాదు. ఆరాధనీయుఁడగు వాని నెదురుగాఁబోయి నమస్కరింపవలయు. దేవగురు ధర్మకార్యములు స్వయముగాఁ జేయవలయు. కుహకులతోడను నాస్తికులతోడ సావాసము చేయరాదు. విలాసకొఱకేనియుఁ బ్రాణులకుఁ దాపకరంబగు పనిచేయరాదు. తల్లియైనను బరస్త్రీతో రహఃప్రదేశమందుండరాదు. ఎంతకోపమువచ్చినను మాన్యుల నవమానింపరాదు. వారిమాట నతిక్రమింపరాదు. శోధింపకుండఁ బరస్థానమునఁ బ్రవేశింపరాదు. కూర్చుండరాదు. స్వజాతిప్రియ్యముచే వాజీణంపని వాహనాదిక మెక్కరాదు మంచిగాఁ బరీక్షింపకుండఁ దీర్ఘమునుగాని పతితునిగాని సన్న్యాసినిగాని నమ్మరాదు. హెగ్గశికాండ్రచేఁ బరిశోధింపఁబడని మార్గమునం జనరాదు. విషనాశకంబగు మణినిగాని యౌషధంగాని సేవింపరాదు. విషవైద్యుని విద్యనెన్నడును గరంమునం దాల్పరాదు. మంత్రియు వైద్యుండును జ్యోతిష్కుఁడును లేకుండ నెన్నఁడును గొలువుచేయరాదు. తానుపయోగించు ప్రతిపదార్థమ్మును పరీక్షయందు

ను నన్యసుఖమందును బరీక్షించి భుజింపవలయు. తానుచేయు సర్వకార్యంబులను న వ్రుతయోగంబునఁ జేయవలయు. ఆంపజీనిఁ దనతో సమానముగాఁ జూచుకొన్నచో నెవరికిని ద్వేష్యుఁడు కాఁడు. పరిజనము దినము శకునము వాయువు నివి వ్యతిరేకముగా లేకుండుటయే భావికార్యసిద్ధిని సూచించును. రాత్రిగాని పవలుగాని నొక్కఁడును సంచరింపరాదు పుత్రోవాక్యయుక్తకర్మంబులను నియమముగాఁ జరుపవలయు. నక్షత్రదర్శనపర్యంతము సంధ్యోపాసనచేయవలయును. తరువాత సముద్రములే స్తనములును ధర్మమె మూఁపయు నుత్సాహమె తోకయు వర్ణాశ్రమంబులే కణంబులును నయప్రతాపంబులే కొమ్ములును సత్యశౌచంబులె కన్నులునుగాఁ గలిగి న్యాయమార్గాభిముఖియగు నీభూమి యనువావును నేను బరిపాలించుచున్నాఁడ. ఎవ్వఁడు దీనికపరాధము గావించునో వానిని నేను బరిశీలించుచున్నాఁడ సహింపను. అనుసీమంత్రము ననుసమాధియుండుఁడి కొంతకాలము జపింపవలయును.

పురుషసంగము నపేక్షించని కాంతతో సంగమింపరాదు. ప్రథమప్రకృతిగలస్త్రీలకనురాగము రహస్యము. ప్రియసంతతమగు కేశము ముఖ్యము. ద్వితీయప్రకృతిగలవారికి మృదుపవనంబును వశ్యాలంబునగు ప్రికేశము కావ్యము. తృతీయప్రకృతిగలవారికి సురతోత్సవమే ప్రధానము స్త్రీపురుషులకు సమయోగముకంటె వేఱుపరీక్షణమంత్రములు లేవు. సమయోగమనఁగా నొకరీతికృతియు నొక్కరీతి యుపదేశఁబును నొకరీతి వైదగ్ధ్యంబును నొక్కరీతి స్వాభావికధర్మంబులును గలుగుటయే. అకాఁగొన్నవానితోడను దప్పికకలవానితోడను బుభుక్షువిమోచనాకాంక్షితోడను నాస్తినితోడను సంగమించిన నిర్దుష్టముగు సంతానము బడయదు. సంధ్యాకాలంబునందును పగటియందును దేవాగారములయందును నుదకములయందును మైథునముఁజేయరాదు పర్వసంధులయందును గ్రహణగ్రస్తుడలందును గులస్త్రీలతో రమింపరాదు. యీవిధికపవాదశాస్త్రములేదు. రాజు పరస్త్రీయింటనుండెన్నఁడను దాసితోఁగూడుండరాదు. వంశమునకుఁ బాత్రమునకును వృత్తమునకు వివక్షయు వితవయసునకును దగిన వేషంబును సమాచారంబును నెవని గుర్తింపఁజేయుడు. వరిశ్రమ చేయకుండఁగను బరిశోధింపకుండఁగను రాజపులమువంశేస్తువు బరిశీలింపరా దేహస్థులు బయటికిఁ దీసికొనిపోరాదు. కుంతలాధిపతి దూతవేషధారియై పల్లాణనరేంద్రుని జంపినట్లును నశ్వపతి విషదిగ్ధమగు మేఁకకొమ్ముచేతఁ గుశస్థలాధిపతిని జంపినట్లును వినుచున్నారము. అవిశ్వస్తులయందుండు నెక్రియయు సిద్ధింపదు.

## 26 (సదాచారసముద్దేశము.)

అతిలోభ మతివిశ్వాస మత్యనుగ్రహము నీమూటిచేతను బృహస్పతియంతవాఁడైనఁ బంచింపఁబడును. జంపఁబడును. బలవంతునితో విరోధపడినవాఁడు దేశాంతరమునకు లేచిపోవలయు లేదా వానితో సంధిఁగావించుకోవలయును కాని యన్యథా క్షేమోపాయము లేదు. దేశాంతరమునకు లేచిపోయినవానికిఁ బౌరుష మెక్కడిది? తనస్వరూపము తెలియకుండ సంచరించినచో వాఁడు గొప్పవాఁడైనను దక్కువవాఁడే. ఆర్తులకు ధర్మబుద్ధి మెండుగ నుండును. ఎవ్వఁడు స్వయముగా ధర్మమందుఁ బ్రవర్తించునో వాఁడు నిరోగుండు. వ్యాధిగ్రస్తునకు దైన్యముకంటె నెక్కువ మందు లేదు. ఎవ్వని జన్మము దురభావముల పాలుగాదో వాఁడు మహాభాగ్యశాలి. మందమతులు పరాధీనంబులగు వస్తువులందు స్వోత్కర్ష వెలిఁబుచ్చుకొనుచుందురు. భయసమయంబులం దేడువక ధైర్యమవలంబింపవలయు. రణమందును శరసంధానంబునందును మోహపడు నతఁడేటి ధానుష్కుఁడు. మరణమందును మనస్సంధానమందును మోహపడు నతఁడేటి తపస్వి. కృతికిఁ బ్రతికృతి చేయనిచో నైహికాముష్మిక ఫలంబులు రెండును లేవు. శత్రువువలననైనను మంచిమాట గ్రహింపనగు. కలహకారిత్వము నప్రీతి పడఁదీయుటయు దుర్మతుల ధర్మము కాని సజ్జన ధర్మము కాదు. ఎవఁడు లబ్ధమగు సంపదచేతనే సంతసించి మఱలఁ దద్విషయకప్రయత్నముఁ గావింపఁడో వానికి సిరి యభిముఖి కాదు. వైరానుబంధ మెవ్వఁడు పశమింపఁజేయఁడో వానికి వంశవృద్ధి యెట్లగు. భీతులకభయదానము కన్నఁ బరమగు దానము లేదు. ఉత్సాహము కామితార్థములను నొసఁగుచుండును. అందఱికిని కల్పవృక్షప్రాయుఁడగు ప్రభువు తనయెడల వంధ్యుఁడగుటకుఁ గారణము తన దురదృష్టమో తన యపరాధమో యని తలంపవలె. ఎవఁడు మూలధనమును వృద్ధిపఱుపకుండ ననుభవించునో వాఁడత్యంత దుఃఖితుఁడగును. మూర్ఖదుర్జన పతితులతోడి సహవాస మెవ్వనికిని శ్రేయస్కరము కాదు. హరిద్రారాగమువలె నెవ్వని చిత్తానురాగము వ్యాపింపనో వాని సంతోషమితములకు ఫలకారి కాదు. తన కొలఁది యెఱుంగకుండఁ బరాక్రమించినచో నెవ్వఁడు పరాభవముఁ జెందకుండు. పరిభవమునకు శాంతియెన్నఁడును బ్రతిక్రియ కాదు. ప్రత్యపన్యాసమే ప్రతిక్రియ కాని అసమయకోప మెంతవిశ్వాసమున్నను పరిజనమునకు వైరస్యము కలుఁగఁజేయును. చచ్చినవారివిషయమయి యేడ్వఁ జనదు. వారికిం దగిన యుత్తరక్రియలు జరుపఁదగు. అట్లుచేయక యేడ్చినచో కన్నీటి బిందువులె ప్రేతల హృదయంబుల కంగారంబులగు. నట్లేడ్చినచో వాఁడు

మునకల బ్రతికి లేని దుఃఖింపవచ్చును. చిరకాలము శోకము హృదయమునం జేర్చుకొన్న చో నది ధర్మార్థ కామముల కుద్వాసన చెప్పును. తానుపదిద్రిఁడయ్యు నెవ్వఁడు విషయములం దభిలాషపడునో వాఁడు కింపురుషుఁడు. అపరిచితులయెడఁ బ్రియపూర్వ కానురాగముఁ గన్పఱుచువారు దేవసమానులు. ఈలోకమున్నంత శాశ్వతమగు కీర్తి సంపాదించినవారు మృతులయ్యును మృతులుకారు. ఎవని కీర్తి చేత భువనంబులు ధవళీకృతంబులు కావో వాఁడు భూభారమునకై జన్మించినవాఁడు. పరోపకార పారీణులకు శరణాగతుల|యెడఁ|బరీక్ష ననదు. అభిచారక్రియల వలనఁ బరాభిఘాత చేయుట మహాపాతకి లక్షణము. ఏరాజునకు విద్విట్పక్షములయందుఁ గాని విశ్వస్తపక్షములయందుఁ గాని గుణగ్రహణ పాటవ్యముండదో వానికి విజయంబును నభ్యుదయంబును నెట్లు ఘటిల్లించును. పరోపద్రవంబును నష్టంబును జేయుతృష్టియుండదో తనకుటుంబము నామిత్రియుంట సంరక్షింపవలయును. పరస్త్రీ పరద్రవ్యముల రక్షించుట వలన లాభములేమిగాని వానికేదేని నష్టమువచ్చినచో గొప్ప ననర్థము మాత్రము కలదు. ఆత్మను రక్తునిఁ బరిత్యజింపరాదు. తనకున్నంతయే వానికిచ్చి సంతోషపఱుప వలయును. ఆత్మశ్లాఘయుఁ బరనిందయు గల భృత్యుఁడున్నచో నెంతపరివారమున్న రాజైనను గొలది కాలములో నేకాకియగును. అపరాధమునకు దగినదండము నపుత్రమిత్రులయెడలనైనను చేయవలయును. పన్ను దేశమునకుఁ దగినట్లు గ్రహింపవలయును. ప్రతిపత్తికిఁ దగినట్లు మాటాడవలయు. ఆదాయానుగుణముగా వ్యయము చేయవలయును. ఐశ్వర్యమనురూపముఁగా విలాసము జూపింపవలె. సహాయానురూపముగాఁ గార్యమారంభింపఁదగు. ధనమునకును శ్రేష్ఠకును దగిన త్యాగమొనరింపఁదగు. సంతోషియే సుఖి. రజస్వలాసంగము చేయు వతఁడు చండాలునికంటె నధముఁడు. సిగ్గుపడఁదగు కర్మము లజ్జాశూన్యముగాఁ జేయరాదు. ఎవనికి సచ్చరిత్రయావరణమై యుండదో వాఁడు దివ్యాంబరధారియయ్యును దిగంబరుఁడే. సచ్చారిత్రవంతుఁడు దిగంబరుఁడయ్యు దివ్యాంబరధారియే. ప్రతివాదసంకోచము గలవానికిఁ గార్యసిద్ధికాదు. వృత్తిహీనమూలకంబై నధికమగు దరిపాయనము లేదు. నిర్భాగ్యులకు పరోపకారమె వృత్తి. పరాధీనమగు భోజనముకన్న నుపవాసము మేలు. వర్ణసంకరము లేని దేశమందు నివసింపవలెను. ఎవఁడు పరలోకమును బరిగణింపఁడో వాఁడు పుట్టంధుండు. ప్రేమయు విద్యయు సత్యంబును వాత్సల్యంబును నశోభవాక్యంబులును ప్రాగల్భ్యమును నిలుపునే కాని ప్రాణ్మాణవ శత్రుత్వము నిలుపదు. నిస్పృహులకుఁ బరాపేక్ష యేటికి. ఆశాక్లేశ మనుభవించువాఁడేఁ పురుషుఁడా! ఎవనిచిత్తము శాంతపరాగముకాదో వాఁడెగ్రహస్థుండు. ఎవనిది

ములం జూ మటకు గ్రుడ్డివారు. శత్రువైనను నింటికివచ్చినచో సత్కరింపవలయునన్న చో నీతులవిషయమయి చెప్పవలయునా!

తనయింటఁ దామరొన్న ధననిక్షేపమునుం బోలెఁ దనచేసిన ధర్మమును దాను ప్రకటింపరాదు. మనప్రమాదముల వలనఁ జేసినదోషముల గురువులకు దెలిపిన పిదప నే ప్రాయశ్చిత్తము. దేవగురు ద్విజాతిథులను శ్రీమంతులు కాయక్లేశపడి సత్కరింపఁజనదు. విభవానుసారముగ సత్కరింపజేసినం జాలును. నీచుల కువరమధ్య లాలన మొనరించినను కొంగలకుం బలె వికార మొనరింపకుండుట తటస్థింపదు. ప్రత్యుపకారాపేక్ష లేకుండ నెప్పుఁడితరుల కుపకారమొనరించునో యతండు ధన్యుఁడు, తెల్వి లేనివాని వైరాగ్యంబును సన్యాసిపటుత్వంబును ఇంద్రియపాటవము లేని విలాసమును వేశ్యారతుని సదాచారంబును తెలిసికోదగిన వస్తువును తెలిసికోలేనివాని తత్త్వవిచారంబును మహాత్ములకు రకణ్యాల ప్రాయంబులు, శస్త్రము లేనివానితోడను శాస్త్రములేనివానితోడను నెవఁడెదిరించునో వాఁడు మహాపాతకి. పుత్రశిష్యులను బంధువుల గృహంబునకు బోయినట్లే యొక్కొకప్పుడు కార్యసిద్ధికై నీచులను నాశ్రయింపవలెను. కార్యార్థి పరదోషము బరిగణింపఁడు. గృహదాసీసంగమును గృహమును గృహిణిని గృహపతినిం గూడ నశింపఁజేయునది. వేశ్యాపరిగ్రహము దేవద్విజ బాంధవుల కుచ్చాటనమంత్రము, జార లోకుల పాపము. తనభార్యరతీదేవి వంటిదయినను గిట్టకున్నది. పరకీయ కుక్కవంటిదైనను రంభయగుచున్నది. ఒక్కదానిని పెండ్లాడినవాఁడే సుఖి. స్త్రీవ్యసని కైనను, నభిసారికల యందున్నంతసుఖము వేశ్యల యందు లేదు. వేశ్యలయందలి వ్యసనమున ధనమా! పోవును దైన్యమా! తటస్థించును దాని యిచ్చవచ్చినట్లు తిరుగుటా సంప్రాప్తమగును, అస్తరణము, కంబళి ఆవు, గాడిద, పెండ్లి కూడిన పెండ్లము. ఏపని చెప్పినను వెనుదీయక సేయు పరిచారకుఁడును నెవ్వనికి సుఖము సేయును. యతి నృపతి వేశ్య! చాకుఁడు భాండసుఁడుఁ వీరింటికి వచ్చుట నష్టమునకే గాని లాభమునకు గాదు. లుబ్ధునకెన్ని సుగుణము లున్నను వ్యర్థములు. ఫలింపని యాచ్నా దైన్య మెందులకు. దారిద్ర్యముకంటె లాఘవకారి లేదు. దానివలన మహత్త్వముగూడ శంకనీయ మగుచున్నది. తనయభిలషితము నెరవేరకున్నను ధనవంతునిం గుఱించి లోకము సంతోషించుచుండు, రత్నహిరణ్య పూతమగు జలముకంటె శుద్ధిచేయు పదార్థము లేదు. బందీమోచనము దీనపరిపాలనము కలయుత్సవమే యుత్సవము. అతిథులకును బరిజనులకును మృష్టాన్నమిడిన దినములే పండుగ దినములు. అధర్మకార్యములు సేయక ధర్మకార్యములు చేసిన తిథులే తిథులు. అకృత్యములు చేయని దీర్ఘయాత్రయే దీర్ఘయాత్ర. వయోవిద్యోచితమగు సమాస్థానము సేయించు

పాండిత్యమే పాండిత్యము. ఇతరులకు నొప్పితగులకుండఁ దనకార్యమును నెఱవేర్పఁజొనుసేయుటే నేర్పు. సర్వజనసమ్మతంబగు లౌకికజ్ఞానమే లౌకికజ్ఞానము. పరుషోక్తియుఁ బరోద్వేగంబును లేని వాచాలత్వమే వాచాలత్వము. యౌవనదోషంబున నెవ్వాదకెంవని ధైర్యమే ధైర్యము. ఆదానము పరవశీకరణముగల సౌభాగ్యమే సౌభాగ్యము. విద్వాంసులులేనిసభ మహారణ్యముగాని సభకాదు లోకమంతటికి నిష్టముగానితనయిష్టమెంచునకు. పరసంబంధము సహింపనిరాజు మహాదుష్టుఁడు. వ్రాఁతకంటె మాట ప్రమాణమైనది కాదు. తెలియని వ్రాఁతయందు విశ్వాసముంచఁజనదు. స్వామిద్రోహము, స్త్రీహత్య శిశుహత్య, యనుమూఁడు మహాపాతకములకు ఫలము తత్కాలముననే సంభవించును. దుర్బలునకుఁ బలవంతునితో విగ్రహము తెప్పలేకుండ సముద్రములో దిగుటవంటిది. బలవంతునియొద్ద వికృతసేయుటకంటె మరణకారణము లేదు. ప్రవాసము చక్రవర్తులకేని సంతాపకరము. చాలదారిబత్తెము. మతికనుకూలమగు పరిజనము వాజియు సువిహితంబులు సాధనంబు కలప్రవాసి విదేశంబులందెంత మాత్రము దుఃఖపడఁడు.

## 28 వివాదసముద్దేశము.

రాజు గుణదోషములకుఁ ద్రాసుకఱ్ఱవంటివాఁడు. సమస్తజనులకును గుణదోషములే గౌరవమును లాఘవమును దెచ్చునవి. రాజధికారులయెడల సమవర్తియైనచో సత్ఫలమనుభవించును. ఆత్మునివలె యథావస్థితమగు నర్థమును బ్రకటించువారు సభ్యులు. వ్యవహారముఁ జూడనివారును వినినవారును బ్రత్యర్థులను లంచము నపేక్షించువారును సభ్యులు కాఁజనదు. లోభపక్షపాతములవలన యథార్థమును మఱుగుపఱచు సభ్యులును సభాపతియును మానహానియు ద్రవ్యహానియు నొందుదురు. సభాపతి తనకు శత్రువగుచోట కవానమే పనికిరాదు సభ్యులకును సభాపతికిని తిన్నని బుద్ధిలేనిచో జయమెట్లుఘటించును. వివాదమొనరించి సభకురాకుండుట పిలిపించినఁ రాఁబోవుట మొదటిమాట తరువాతిమాటను బాధించుట పరోక్తులకు నిరుత్తరుండగుట యుక్తియుక్తమగు మాట నంగీకరింపకుండుట స్వదోషమును గప్పిపుచ్చుట పరునిదోషము లుదాహరించుట యథార్థవాదమందు నుపేక్షించుట మొదలగునవి సభాపతిపరాజితులకుఁ జిహ్నములు. సాక్ష్యముకంటె భుక్తము. పత్రముకంటె సాక్ష్యము ప్రబలమైనది. భుక్తమనగా ద్వాదశసంవత్సరపరిమితము. ఆక్షేపముగల భుక్తంబును నష్టసాక్ష్యమును కూటలిఖితమగు పత్రంబును వివాదము తీర్చుటకుఁ జాలవు. బలాత్కారముగను నన్యాయముగను రాజబలముననుజేసిన ప్రమాణము కాదు. వేశ్యయుఁ గితవుం

దును. చెప్పిన సాక్ష్యము గ్రంథానుసారముగను కాలానుసారముగను బరికించి నమ్మద లయును. అసత్యరూపమగు వ్యవహారమునకు విచారణమె యనవసరము. ధనన్యాసవిష యకమగు వివాదము పురుషునియందలి ప్రామాణ్యము ననుసరించి నిర్ణయింపవలెను. లేదేని దివ్యప్రమాణవచనముల నిర్ణయింపఁదగు. గ్రంథమర్యాదలు లేనిసాక్షి దివ్య ప్రమాణవచనములును నమ్మరాదు వాదిప్రతివాదులుభయులకును నమ్మదగు సాక్షి ప్రమాణవాక్యములు నమ్మవచ్చును. విటులయు లింగులయు నాస్తికులయు దురాచారులయు దైలికప్రమాణ వాక్యములు నమ్మరాదు. వారిసాక్ష్యము కార్యసిద్ధికిఁ గార్యసిద్ధికిని గూడఁ బనికిరాదు. ప్రత్యక్షులను ముఖ్యోక్తులనుఁ బరీక్షించి తీర్పుచెప్పలెను. పరవిప్రలాపమున్నచో యుగాంతరములకైనను వివాదసమాప్తి కాదు. సభలోఁ భూమిపైఁ గూర్చుండరాదు. సాక్షులన్యోన్యము మాటలాడుకొనరాదు. జానపద పౌరవ్యవహారముల యెడల వివాదము కలిగిన రాజావలననే తీర్పుఁజెందవలెను. రాజపరీక్షితమగు దానియందు దోషముండదు. రాజశాసనమును రాజమర్యాదను నతిక్రమించిన వానికి సర్వస్వాల ఫలంబగు దండనము విధింపవలెను. దుర్మార్గులకు దండనేతరమగు నివారణోపాయము లేదు. కట్టెవంకర పొయ్యియె తీర్చును. దరిద్రినెల్లరును బరాభవింతురు. నరకమగు దారువు చీల్పఁబడినట్లు వక్రదారువు చీల్పఁబడదు. అపరాధులను క్షమించుట సమర్థునకుఁ దప్పకాదు గాని తన్నెదిరించినవానిని క్షమించుట యనమర్థత్వమనిపించుకొనును దుష్టపాలిత్యముగల రాజులజూచినఁ బాములజూచినట్లు జనులు భయపడుదురు. బహునాయకము ననాయకయు నగుసభఁ జొరరాదు. పరప్రవేశముగల గోష్ఠి తలఁపరాదు. స్వనిందా పరిహార మాత్రమే సజ్జనులకుఁ బరనింద. ప్రతివచో ముఖంబునను రాజస్తుతి యనవసరము

అర్థసంబంధము గాని దుస్సహవాసము గాని కలహము గాని యాకస్మికార్థలాభము గాని ప్రాణములతో పాటుసంపాదించిన పూర్వార్జిత ద్రవ్యమునుగూడ నశింపఁజేయును. బ్రాహ్మణులు హిరణ్యమునుగాని జన్నిదమునుగా స్పృశించియు క్షత్రియులు శస్త్రములనుగాని, రత్నములనుగాని, భూములనుగాని, వాహనములనుగాని, జీనులనుగాని, స్పృశించియు. గోమట్లు ధనగోపన స్థానమునుగాని, బిల్లవానింగాని, కాకిణి హిరణ్యములనుగాని, మట్టియు కూమ్రిలు పాలుగాని, విత్తులుగాని. పుట్టలుగాని, తాకియు శిల్పులెవ్వరే క్రియవలన జీవింతురో తత్క్రియా సాధనములను స్పృశించియు యితులిష్ట దేవతాపాదములు స్పృశించియుఁ జేసినశపథము దివ్యశపథ మనఁబడును. కోశము తంతులములును తులాదండములను స్పృశించి చేయు శపథంబు దివ్యంబునాఁ

బడు. అర్థ్యులచే తడితోలుమీఁద నెక్కించి శపథముఁ జేయింపవలెను. కిరాతులచే వింటిబడ్డను దాటించుటయే దైవికప్రమాణము, ఉంచుకొన్న లంజెసానియు గోపశీలుండగు పరిచారకుఁడును దనవానియొద్ద నుద్యోగంబును నియోగిమైత్రియు శాశ్వతంబులు కావు. అన్న విక్రేత యింటి యాహారమునకుంబలె లంజెసానులయందభిరుచి రుచిశూన్యము. ఎవ్వఁడేవస్తువు నెంతప్రేమించునో వానికిదానివలన నంతపరితాపంబును గలదు. రాజునకేమి గంటలో చాకలివానికి గాడిదయునంతే. మూర్ఖునకుఁ గలిగిన యాగ్రహము పాయముచేయకుండ నురలదు. మూర్ఖునకు శాంతోపదేశము దూదికగ్నివంటిది. మూర్ఖునకు కథ్యోపపత్తి గలుపుట యుద్దీపనదండమువంటిది. మండుచున్న క్రోధాగ్నికి శాంతవచనంబులింధనంబులు గాని జలంబులు కావు. అంధుఁడంధులను గొంతెఁద్రోచినట్లు మూర్ఖసహవాసము మాధ్యమును బెంచును. స్వభావనిర్గుణంబగు వస్తువునందుఁ బక్షపాతమున నెంతమంది గుణవర్ణన చేసినను గుణవత్త్వము రాదు. మేక మెడచన్నులనుండి పాలెవ్వఁడు పితుకఁగలఁడు.

## 29 షాడ్గుణ్యసముద్దేశము.

సమవ్యాయామములు యోగక్షేమములకుఁ గారణములు. కర్మప్రారంభములకుపాయాన్వేషణమే వ్యాయామమనంబడు. కర్మఫలప్రాప్తివిషయమయి యుపాయాన్వేషణము క్షేమసాధనంబగు శమమనంబడు. దైవంబును మనుష్యప్రయత్నంబును గలసి కార్యసిద్ధికి మూలంబులు. దైవమున ధర్మాధర్మంబులు. మానుషప్రయత్నము చింత్యము. దైవమచింత్యము. తలపకుండ సంప్రాప్తించిన యర్థానర్థములు దైవాయత్తములు. బుద్ధిపూర్వకముగ హితప్రాప్తియు నహితపరిహారంబును మానుషాయత్తంబులు. మనుష్యప్రయత్నలభ్యములయందును దైవాయత్తత లేకపోలేదు. దైవమున్నను మనుష్యప్రయత్నము లేకున్న భద్రములేదు. దైవాయత్తమని యూరకున్నచో విల్లంబులతో దుగునా! ప్రయత్నముఁ జేయు వాని కర్థానర్థప్రాప్తియందు సందేహముగాని దైవముమీఁదనే భారముంచి ప్రయత్నముఁ జేయనివానికి మాత్రమనర్థమే తటస్థించును. ఔషధమును గాయున్నునకుంబోలె దైవపౌరుషములకు బరస్పరసంబంధము కలదు. ఆసంబంధమే కార్యసిద్ధిసాధనము. యోగక్షేమముల నిష్పత్త్యుపాయమే నీతియనంబడు. దుర్నీతి విపత్తునకు హేతువు, త్రిమూర్తిస్వరూపుఁడగు రాజుకంటెఁ బరమగు దైవములేదు, బ్రహ్మచర్యాశ్రమమువలంబించి పరబ్రహ్మమునందు నిష్ఠాతబుద్ధియై గురుకులము నాశ్రయించి తెన్నగా విద్యలు సంగ్రహించి కౌమారము నాశ్రయించిన రాజపుత్రుఁడు బ్రహ్మయగును. రాజ్యలక్ష్మీపట్టాభిషేకముఁ జెంది తనగుణములవలన ప్రజా

నుత్సాహము గలుగఁజేసికొను రాజు నారాయణమూర్తి యనఁబడు. "నావిష్ణుః పృథివీప
తిః" యను వచనమిటనియుండె వర్తించును. ప్రతాపమను తృతీయలోచనము నవలంబిం
చి పరమైశ్వర్యముతో రాష్ట్రకంటకులగు నసురులను శత్రువులను దానవులను జయింపఁ
దలఁచిన విజిగీషువగు రాజు పరమేశ్వరమూర్తి నాఁబడు. ఉదాసీనుఁడు మధ్యముఁ
డు విజిగీషువు, అమిత్రుఁడు, పార్ష్ణిగ్రాహుఁడు, ఆక్రందుఁడు, ఆసారుఁడు, అంతర్ధి యను
వారు మండలాధిష్ఠాతలగు రాజులు. వీరికిఁ గల లక్షణములు వేఱు. విజిగీషు మండలమునకు
ముందును వెనుకను బ్రక్కను గోణములయందును గల మండలమందుండియు నిగ్రహిం
చిన మధ్యముల నిగ్రహించుటయందును గలసివచ్చినవారి ననుగ్రహించుటయందును
సమర్థుఁడై యుండియు గారణాంతరమున విజిగీషులై యితరుఁడు వచ్చినను నుదాసీన
భావము చే నుండువాఁ డుదాసీనుఁడు నాఁబడు. ఉదాసీనుని వలె నేప్రక్క మండల
మునందుండియుఁ దాను విజిగీషువుకంటె నధికబల సమన్వితుఁడయ్యు నొకానొక కా
రణమున మాధ్యస్థ్యము వహించియుండువాఁడు మధ్యస్థుఁడు నాఁబడు. రాజ్యము పురుష
కారము దైవబలము. ద్రవ్యము చతురంగబలము. నీతివిక్రమములను గలవాఁడు, విజిగీ
షువనంబడు. విజిగీషువునకు హితమగు కార్యముఁ జేయుచు ప్రతికూలుఁడగువాఁడే య
మిత్రుఁడు. మిత్రలక్షణమింతకుమున్నే వివరింపఁబడినది. విజిగీషువు దాడివెడలనున్న
ప్పుడుగాని వెడలినపిమ్మటఁగాని కోపమును బుట్టించువాఁడు పార్ష్ణిగ్రాహుఁడు. విజి
షునకుఁ దరువాతి శత్రు వాక్రందుఁడు. పార్ష్ణిగ్రాహాక్రందుల కమిత్రుండాసారుం
డు. అరివిజిగీషువుల మండలములకు మధ్యస్థంబగు మండలమునందుండి యుభయులచే
జీతముఁగొనువాఁడంతర్ధి యనఁబడుచుఁ బర్వతాటవ్యాదుల నాశ్రయించియుండు.
లుబ్ధుఁడును క్షుద్రుడును విరక్తులగు ప్రకృతులు గలవాఁడును ననుగుణ స్వభావము
కలవాఁడును నన్యాయశీలుండును వ్యసనముగ్నుండును ప్రతికూల మిత్రామాత్యమంత్రి
సేనాపతి సామంతాదులు కలవాఁడునునగు శత్రువుపై దాడివెడలనగు. అరి అశ్రయ
శూన్యుఁడై యున్నప్పుడును దుర్బలాశ్రయుఁడై యున్నప్పుడును నుచ్ఛేదనీయుఁడు
గర్షణీయుఁడును పీడనీయుఁడును నగు. సమాభిజనుండును సహజశత్రువిరుద్ధములగు ల
క్షణములు కలవాఁడును విరోధయితయు నగువాఁడు కృత్రిమశత్రువు. శత్రువునకుఁ
దరువాతివాఁడు మిత్రుఁడేకాని యామిత్రత్వము శాశ్వతముకాదు. అవసరమే మి
త్రత్వామిత్రత్వములకుఁ గారణములుగాని యాంతర్యానంతర్యములు కావు బుద్ధిబల
ము మంత్రశక్తి యనఁబడు. చెవులపిల్లి సింహమును జంపుటయే బుద్ధిబలమునకు దృష్టాం

తము. ప్రభుశక్తి యనఁ గోశదండబలంబులు. దీనికి శూద్రకమహారాజును శక్తికుమారుండును నిదర్శనములు. ఉత్సాహశక్తి యనఁ బ్రారంభించినకార్యమునకై విక్రమబలంబున వెనుదీయకుండుట. దీనికి రాముఁడు దృష్టాంతము. అభివృద్ధిగాఁ శక్తిత్రయసంపదకలవాఁడు గొప్పవాఁడు. బలవంతుఁడు, శక్తిత్రయహీనుఁడు హీనుఁడు. సమానశక్తిత్రయసంపద కలవారు సమానులు. సంధివిగ్రహయానాసనద్వైధీభావసంశ్రయములు షడ్గుణములు. అందుఁ బణబంధమే సంధి. అపకారము విగ్రహము. దాడివెడలుట యానము. ఉపేక్షయే యాసనము. శరణుఁజొచ్చుట సమాశ్రయము. ఒకనితో సంధి చేయుచు రెండవవానితో విగ్రహించుట గాని యొకనితోడనే సంధిసేయుచు విగ్రహించుట గాని ద్వైధీభావము. హీయమానముగు పణబంధము కలవానితో సంధిచేయఁదగు. వాఁడు పరిణతంబగు నర్ధంబున మర్యాదోల్లంఘనము సేయఁడని వానితో సంధి యుచితము. అతివృద్ధిమయంబునందాత్మరక్షణము లేదని విగ్రహింపనగు. నన్నితఁడు జయింపలేఁడు నేనితరులను జయింపలేను నవస్థయందుత్తరకాలమునం గాలమున్నచో నాసనముచితము. రాష్ట్రకంటకులు లేకున్నను బశ్చాత్కోపము లేకున్నను గుణాతిశాయియే సర్వాతిశాయి. తనమండలమును రక్షింపకుండఁ బరమండలముపై దాడివెడలుట బట్టకట్టుకొనక తలపాగ పెట్టుటవంటిది. గ్రీష్మవానికిఁ గాలిసంకెలవంటిది. శక్తిహీనుఁడు ప్రబలనాశ్రయింపఁదగు. బలవంతునకు భయపడి దుర్బలు నాశ్రయించుట యేనుఁగువలని భయమున నాముదపుచెట్టెక్కుటవంటిది. అస్థిరుం డస్థిరు నాశ్రయించుట నదిలోఁబడి కొట్టుకొనిపోవువాని నింకొకఁడు కొట్టుకొనిపోవువా నాశ్రయించుటవంటిది. మానికవమానముకంటె మరణము మేలు. పరులు యిచ్చవచ్చినట్లు తినుచు నాత్మవిక్రయమును చేసికొనుట మేలుగాదు. ముందు మంచిదశ రాఁబోవునని యెఱిఁగినప్పుడేదియో యొకసంబంధమున వారిని సమాశ్రయించుట యుక్తము. రాజకార్యములను గాలనియమము లేదు. రాజకార్యములు మేఘములవలె బయలుదేరుచుండును. ఉదాసీనులయెడలఁ గాని శత్రువులయెడలఁ గాని సంధివిగ్రహములకంటె ద్వైధీభావమే మంచిది. యిద్దరు బలవంతుల నడుమనున్న శత్రువు రెండుసింగములకు నడుమనున్న యేనుఁగువలె సుఖసాధ్యుఁడగును. తనరాజ్యము సమర్పించుటకంటెఁ బన్నిచ్చుచుండు నిరాజ్యము తనయధీనమందుంచుకొనుట మంచిది. పన్నిచ్చుట యనిత్యము. బోయినచో రాజ్యము మరలరాదు. బుద్ధిపూర్వకముగా విత్తకుండినను భూమ్యాశ్రయణ చేసిన విత్తుమొలచి చెట్టై పెరుగుచుండు. భూమిని బరిత్యజింపని రాజేల పెరుగఁడు ఉపాయమూలముగా విగ్రహించుచుఁ బ్రకృతిమండలమును ననురాగముతోఁ బెంచు

గా నల్పదేశముకలవాఁడైనను గొందికాలములో సార్వభౌముండగును. ఎవ్వనికి భూమి కులపాలిక కాదు. వీరభోజ్యవసుంధర. సామదానభేదదండములని నాలుగుపాయములు. గుణకీర్తనమనియు సంబంధోపస్థానమనియుఁ బరస్పరోపకార ప్రదర్శనమనియు నాయతిప్రదానమనియు నాత్మోపసంధానమనియు సామము పంచవిధము. నాద్రవ్యమంతయు నీది నేను నీవాఁడను నేను నీయిచ్చవచ్చినట్లు వర్తింతును అని తనయాత్మను సమర్పించుట యాత్మోపసర్పణ మనిపించుకొను. బాలధనమునుఁ గాపాడుకొనుటకై యల్పద్రవ్యము నొసఁగి సమాధానపఱచుకొనుట దానమనఁబడు. విషాదిప్రయోగంబుల వలనను గుణాగ్రబుద్ధిగల గూఢచారులను శత్రుసైనికులఁగాఁ జేసియు శత్రుపక్షమువారికి నన్యోన్యకలహజననంబగు క్రియఁ గావించుటయే భేదము. చంపుట బాధించుటయు ద్రవ్యము హరించుటయు దండమనంబడు. శత్రుసమీపమునుండి వచ్చినవానిం జక్కఁగాఁ బరీక్షింపవలయు. మంచిబుద్ధికలవాని ననుగ్రహింపవలయు. అరణ్యమందుఁ బుట్టినను నౌషధము క్షేమకారియేగదా! గడ్డగూబవలె నల్పజంతువైనను శత్రుసంబంధియగు జంతువు గృహప్రవేశముఁ గావించెనేని దంతియును బాధచేయును. మిత్రహిరణ్యభూమిలాభములలో నొకటికంటె నొకటి యెక్కువది. భూలాభమువలన హిరణ్యలాభంబును హిరణ్యమువలన మిత్రలాభంబును గలుగును. కానసమర్థుఁడైనయెడల హిరణ్యభూమిలాభములకంటె మిత్రలాభమె గొప్పది. ఒక్కొక్కతఱి భూమికంటెను మిత్రునికంటెను హిరణ్యమె గొప్పదగును. శత్రువునితో మైత్రి చేయవలసిన యెడ వాని వంచింపకుండునట్లుగాఁ జేయవలెను. సిద్ధార్థమును గూఢాపాయమున నపహరణముఁ జేయఁజాలరేని సర్వశంకాదురపవాదము తటస్థించును. దుర్జనునకథమప్రవాహముఁ గావించియు మాన్యులచే నుపదేశముఁ జేయించియు నుపశమింపఁజేయవలెను. శత్రునీచకులకు గూఢముగఁ దానము జీతములిచ్చుచు స్వాధీనపఱచుకొవలెను. శత్రువుల దాయాదులకు భూమియిచ్చి లోఁబఱచుకొనవలెను. ఒకనిభూమి యింకొక్కనికి నిచ్చుటకు గొప్పప్రయత్నము కావలెను. సత్యమగు శపథము పరవిశ్వాసజనకము. ప్రధానపురుషాది నిగ్రహమువలను హేతువగును. అనర్థములు మూర్ఖగ్రములవంటివి. సూచీముఖమున పెద్దదారముఁగూడఁ బ్రవేశించును. క్షయమనఁగాఁ బుణ్యపురుషనాశమే. హిరణ్యధాన్యాదినాశము వ్యయము. స్వామిద్రోహము కాకుండునట్లుగాఁ దగిన లాభమపేక్షింపవచ్చును. రాబోవు నర్థమునకుఁ గాలహరణముఁ జేయరాదు. ఎన్నఁడు ద్రవ్యము దొరకునో యని సర్వశుభగ్రహనక్షత్రశుద్ధమగుకాలము గడుపువలెనే గడుపుచుండి చిక్కినట్లు ద్రవ్యముచేతనే ద్రవ్యమార్జింపవలెను. బుద్ధిపోవు

వంబులు ఏవ్యాజమునఁ గాలవు. పెక్కుమంది కలసి తనకపకారముఁ జేయఁదలఁచినను వారందఱకిని నొక్కసారి దండము విధింపరాదు అప్పుడప్పుడొక్కొక్కనికే శిక్ష విధింపవలయును. నూర్గురి నొక్కసారి చంపరాదు వేయిమంది నొక్కసారి దండింపరాదు. ఏభూమియందు రాక్షసకృత్యములు జరుగునో యాభూమి రాజన్వతి. ప్రభుత్వం దోషశోధన ముత్తరకాలావరోధకము కాదేనిఁ జేయఁదగు. ఉత్తరకాలార్ధసంబంధము గల యర్థ మనర్థమే కాదు. భూతభవిష్యద్వర్తమానకాల సంబంధమువలన లాభము త్రివిధంబు నాఁబడు.

## 30 వివాహసముద్దేశము.

పండ్రెండుసంవత్సరముల పెండ్లికూతురు పదియాఱువత్సరముల పెండ్లికొడుకును వివాహమునకు యోగ్యులు. ఇరువురును లోకవ్యవహారయోగ్యులు కావలయును. వివాహపూర్వకంబగు వ్యవహారము నాల్గుజాతులవారికిని సాంకర్యాభావమునఁ గులీనత్వమును సంపాదించును. ముందు మాటలు జరుగుటయుఁ దివస మగ్నిదేవద్విజసాక్షికముగా యథావిధి పాణిగ్రహణమె వివాహమనంబడు. తల్లిదండ్రులు మొదలగువారు కన్యను యథాశక్తి నలంకరించి దానపూర్వకముగా వరునకిచ్చిన వివాహము బ్రాహ్మమనంబడు. "నీవు యావజ్జీవమీమహాభాగమునకు సహధర్మచారిణివి కమ్ము" అనినియోగించి కన్యాప్రదానము చేసిన పెండ్లి ప్రాజాపత్యమనంబడు. గోమిథునమును గట్నమిచ్చి చేసిన పెండ్లి యార్షము. ఋత్విజునకు యాగదక్షిణగాఁ గన్యనిచ్చినవివాహము దైవము. ఈనాలుగువివాహములును ధర్మ్యములు. తల్లిదండ్రులయు లేక బంధువులయు ప్రామాణ్యము కలిమిఁ బరస్పరానురాగపూర్వకముగా నన్యోన్యసమయపూర్వకముగా వధూవరులే చేసికొన్న పెండ్లి గాంధర్వము. దానమునఁ బందెముగాఁ గన్యకనొడ్డిన పెండ్లి యాసురము, బలాత్కారకన్యాహరణము రాక్షసము. సుప్తమత్త కన్యాహరణము పైశాచికము. ఈనాలుగువివాహములు నధర్మములుకాని యధర్మ్యములుకావు. వర్ణభేదంబున వానికిని నంగీకారము కలదు. వధూవరుల కిరువురకును శుభలక్షణములు. శుభప్రదములు కనీనికలయందు లోమములును సన్ననిపిక్కలును వంకరలేని తొడలును, కటి నాభి జఠరము కుచములు శిరము వీనియందు శుభలక్షణములు లేమియు భుజంబుల నలుపును తాలుజిహ్వాధరంబులయందారుపచ్చని రంగును యెచ్చుతగ్గుదంతములును గండములయందు గోఁతులును చెవుల కెచ్చుతగ్గును. అతిలఘుత్వాసాధిక వయోధిక కుబ్జవామన కిరాతాంగత్వంబును. వసమానజన్మదేహత్వము ననునివి కన్యాదోషంబులు. కన్యకంజూచు

కొలుసవయఁసుగాని దూతగాని వరబంధువులుగాని తా తాత్తుగ గన్యాగృహమునకుఁ బోవు నప్పటికి కన్యస్నానము చేయుచున్నచో రోగగ్రస్తురాలగును. ఏడ్చుచున్నచో మగనిం జంపును. నిదురఁబోవుచున్న నల్పాయుష్కురాలగును. విచారించుచున్న దుఃఖితయగు. ఇంటలేకున్న లంజయగు. కలహించుచున్నఁ బరిజనద్వేషిని యగు. అక్రమదర్శన మతి కనిష్టురాలగు. గావున నట్టి కన్యను బెండ్లియాడరాదు. పాణిగ్రహణకాలంబునఁ బాణి శిథిలమయినచో వరునిఁ గన్య పరిభవించును. వరుఁడు తన మొగమువంకఁ జూడకున్నప్పుడు వికాసితలోచనయై వరునిం జూచు కన్యక ప్రచండయగును. ఏకశయ్యయందున్నతఱి లాలింపని వరుని స్త్రీ పశువుగఁ దలఁచును. లాలింపకుండ బలాత్కారగ్రహణము గావించినచో స్త్రీ యాజన్మవిద్వేషిణి యగు. ధైర్యముఁ జాతుర్యము లేనివాఁడు కన్యకను బొందనోపఁడు. సమానమగు కులీనత సమమగు నైశ్వర్యము భిన్నమగు గోత్రము కల వధూవరులకే వివాహసంబంధము న్యాయము. కన్య తనతండ్రికంటె నల్పైశ్వర్యవంతుండగు మగనిం గణింపదు. దరిద్రుని కన్యకను భాగ్యవంతుండగు వరుండును బరిగణింపఁడు. వారి కన్యోన్యానురాగము కుదురదు. దరిద్రునకు గొప్పవారితో సంబంధము వ్యయకారణ మవజ్ఞాకారణ మసంతుష్టికారణముగను బరిణమించును. అవిశుద్ధకన్యాపరిగ్రహముకంటె వేశ్యనుంచుకొనుట మంచిది. అట్టికన్యక జన్మమే గర్హణీయమగును. ధనవంతుఁడు లోభియైనచోఁ బరిచారకులేమి చేయుదురు మామిడిచెట్టు పండియున్నను వాకిలిఁగొన్న చిలుకలేమి సేయఁగలవు. రెస్సుగా వరింపఁబడినదయ్యుఁ బాణిగ్రహణము కాకున్నంతవఱకుఁ గులీనతాసంకరము కలిగినచో నాకన్యను వివాహమాడక విడువవచ్చును. ఆనులోమ్యముగా బ్రాహ్మణులకు నాల్గుజాతుల కన్యలును క్షత్రియునకు మూడుజాతుల కన్యలను కోమటికి రెండుజాతులవారును వివాహయోగ్యులు. మాతులకన్యావివాహము దేశకాలముల నపేక్షించియున్నది. అవిభిన్నమగు సంతానము. అనురాగము గృహవార్తలందుఁ జెప్పినట్లు వినుట. వంశమునకును జాతికిని దగినయాచారము దేవద్విజాతిథిసత్కారము సేయుట బంధులకు కార్యములే దారసంగ్రహమునకు ఫలములు. కావుననే పెద్దలు "గృహిణీ గృహముచ్యతే" అన్నారు. గృహమన గృహిణియేకాని తలుపులు ద్వారబంధములు దూలములు మొదలగు కాష్ఠసంఘాతము గృహముకాదు. గృహకృత్యములు చక్కఁగా నెరవేర్చుకొనుట. అసంతృప్తము కాకుండఁ బదార్థములు వాడుట గృహకృత్యములయందుఁ దప్పఁ దక్కినవ్యవహారములయందు స్వాతంత్ర్యములేక యుండుట సదాచారము. తల్లివంటి స్త్రీలతోఁగూడ నంతఃపురమందుండుట యనునవి స్త్రీరక్షణోపాయములు. వేశ్యలు

సర్వసామాన్యలు. వారితో నభిజాతుండు రమింపఁడు. ఇచ్చినకొలఁదిఁ బ్రేమఁజేయుట సత్కరించినకొలఁదిఁ బరోపభోగ్యలగుట. శక్తిలేనిచోఁ బరిభవించుట లేక చంపుట. ఎంతయుపకారముఁజేసినను నాత్మప్రియురాలు కాకుండుట. ఒకగడియ దేవతచేయున్నను నాఁగడియలో బరునితో సంగమించుట మొదలగునవి వేశ్యాస్త్రీలకుఁ గలాగతములగు ధర్మములు.

## 31 ప్రకీర్ణకసముద్దేశము.

ఇఁకఁ బ్రకీర్ణకసముద్దేశముం జెప్పుచున్నాను. సముద్రమువలెఁ బ్రకీర్ణములగు సూక్తిరత్నముల నిండఁ జొన్పుటచే నిదియవ్వాఙ్మయంబునం బరగుచుండె. వర్ణపద వాక్య ప్రమాణప్రయోగ విజ్ఞాన గౌరవ మెఱింగిన సుమతియు సుముఖుండును సువ్యక్తగంభీర మధురధ్వనియుఁ బ్రగల్భుండును బ్రతిభాశాలియు నూహాపోహశాలియు నవధారణావగమకుశలుండును నక్షరములు వ్రాయుటయుఁ జదువుటయు నేర్చినవాఁడును సంధివిగ్రహిక లక్షణములు కలవాడగును. కథావిచ్ఛేదంబును దొంతరపాటును ముఖవైరస్యంబును నవేక్షణంబును స్థానత్యాగంబును జక్కఁగఁ జేయఁబడినదానియందును గూడ దోషోద్ఘాటనంబును, మౌనంబును నసహనంబును గాలయాపనంబును నాకాదర్శనంబును, నసత్యాలాపంబును విరక్తలక్షణంబులు. దూరావేక్షణంబును ముఖప్రసాదంబును బ్రశ్నలయం దాదరంబును, ప్రియవస్తువులను స్మరించుటయు, పరోక్షమందు గుణగ్రహణముఁ జేయుటయు, తత్పరివారమును శ్లాఘించుటయు దదనునయప్రవృత్తియు ననురక్తలక్షణములు, చెవులకింపును బాగ్యవిరుద్ధముగాని యర్థాతిశయంబును, శుభవాక్యరస సంపన్నతియు, ననన్యాసాధారణ వచనోద్ధతియు, ననన్వయ విరుద్ధత్వంబును ననునివి కావ్యగుణములు. అతి పరుషవర్ణ విన్యాసంబును నసహిత యతియు ననిన్వితార్థంబును నపశబ్దపదోపన్యాసంబును నభీష్టయాభిధానాతిశయాన్యాసత్వంబులును ననునివి కావ్యదోషంబులు, కవులష్టవిధములు కలవారు. మనఃప్రసాదమును గళాకౌశలంబున సుఖముగఁ జతుర్వర్గముం దెలియుటయు సంసారంబునం గీర్తియుఁ గవిసంగ్రహమునకు ఫలంబులు. ఆలాపశుద్ధియు మాధుర్యంబును బ్రయోగవైదగ్ధ్యంబును మార్దవంబును ననుముఖుండును దనువుం బులకితముం జేయుటయు, రాగాంతర సాంకర్యాభావంబును గృహీతరాగనిర్వాహంబును మనోరంజకత్వము ననునివి సంగీతలక్షణములు, సమత్వము మవాలములో గలియుటయు, గాయకభావము ననుసరించుటయు, మార్దవంబును వ్యక్తయతి ప్రయోగంబును, శ్రుతిమధురత్వంబు ననునివి వాద్యగుణంబులు, మా

ఘునందును నభినయమునందును నృత్యంబునందును, సమమగు సముద్యోగంబును, సంగీతము ననుసరించుటయు, మృదువగు నభినయంబును రసోచితమగు హావభావములు గన్పఱచుటయు నృత్యలక్షణములు. దుర్మార్గుల ప్రస్తావనయందును నెప్పుడు దుర్వచనముఁ బలుకఁడో వాఁడు మహాత్ముఁడు. ఎవని యింటికిఁ బోయి యతిథులు కృతార్థులు గాకుండ మరలుదురో వాఁడు నిర్భాగ్యగృహస్థుఁడు. ఋణగ్రహణమున ధర్మంబును సుఖంబును లేదు. ద్రవ్యము యాచకులకిచ్చినఁ దఱుఁగును గాని విన్యతిరుగదు. దాత ఋణమిచ్చినచో వానికిఁ బరితాప మత్యాసన్నమై యుంటయు గలవాఁడును బరాభవంబును నిచ్చినద్రవ్యము మరల రాకుండుటయుఁ దటస్థించును, దాత గానివాఁడు మరలఁ దనయిచ్చిన ద్రవ్యము వచ్చువరకును స్నేహమును సౌజన్యంబును బ్రియభాషణంబును పాఘత్వంబును విడువఁడు. ఏ అసత్యమువందుఁ బరోపకారంబును స్వార్థలాభంబును లేకో యది యసత్యము కాదు. శాస్త్రమున కన్నంతను నసత్యమువలని భీతిలేదు, ద్రవ్యము కొఱకుఁ దల్లినైనను జంపుటకు వెనుదీయఁడు. అసత్యమునకుఁ జంకఁడు, వివాహముకంటె సకలానర్థ నిదానము మఱొకటిలేదు గాని వధూవర నిర్వాహము మాత్రము దైవాయత్తము. రతి కాలంబునఁ బలుకఁదగనిమాటలులేవు, ఒకటియు జరుగనది కాదు, గాని యంతమాత్రమున దాంపతుల ప్రీతి చెడదు. ప్రీతిసౌమ్యము గాని కలహము గాని రతికైతవము గాని యున్నచో దంపతులయనురాగము చెడును. ఎప్పటి కప్పుడు సంపాదించుకొను సైన్యముగల రాజునకు జయమెక్కుడిది. వాని ప్రాణార్థస్త్రీలయందుఁ గళ్యాణమెక్కుడిది కృతార్థులగుదమక వంశమును సంతతియెడల విషయముఁ బాపుదురు. కూడజన్మించిన దేహమయినను జీవునితో వెంటరాదన్నచో నిఁక నన్యులు వత్తురా! అశుభమునకుఁ గాలహరణమే ప్రతీకారము. పక్వాన్నంబువలనం బలె స్త్రీలవలనను దేహతాపోపశాంతియే ప్రయోజనము. అనురాగ విరాగములేల. గడ్డిపోచతోనైనను బ్రయోజనమున్నప్పుడు కరపాదధారియగు మానవునివలనఁ బ్రయోజనముండదా! ఎవరు వ్రాసిన కమ్మనైనను మఱువరాదు. రాజునకు సమయము వచ్చినప్పుడవియే ప్రధానములు. సంధివిగ్రహాదివ్యాపారంబును సర్వజగద్వ్యాపారంబును దమ్మాలముగ జేయున్నది. నీతి విదులు పుష్పయుద్ధమునైన నంగీకరింపరు. శరయుద్ధము నంగీకరింతురా! పెక్కురను పోషించువాఁడే రాజు. అర్జునవృక్షము పండినసేమి! ఎండినసేమి. త్యాగి కల్పవృక్షమువలె సర్వజనంబాధలను సహించును. రాజులు పర్వతములవలె దూరసౌందర్యము గలవారు. నటప్రక్కలకు దేశవార్తలన్నియుఁ దెలియుదఱు పాఠకులున్న దేశములే రమణీయములు. ధనమును బంధువులను లేనివానికి దాను

ద్యసంచారముగల దేశంబును మహారణ్యమువంటిది. శ్రీమంతున కరణ్యంబును రాజధా
నియే. ఆసన్నవినాశుండగువానికి మతివిపర్యాసము కలుగును. పుణ్యవంతునకు కా
ర్పణ్యదశయే లేదు. అనుకూలదైవమున్న విపదలను ద్రోచి సమస్తసంపదల నొసంగును.
అనహానుండును బీదనుండును గృతఘ్నుండును దీర్ఘకోపియుఁ గర్మచండాలురు. ఔ
రసుఁడు క్షేత్రజుఁడు దత్తుఁడు కృత్రిముఁడు గూఢోత్పన్నుఁడు అపవిద్ధుఁడు నను
నార్గురుపుత్రులును దాయాదులు పిండదానంబునకు యోగ్యులు. కానీనుఁడు సహోఢుఁ
డు క్రీతుఁడు పౌనర్భవుఁడు స్వయందత్తుఁడు శౌద్రుఁడు ననునార్గురును దాయాదులు
కారు. పిండదానంబునకుం దగరు. కొన్నిదేశములందుఁ గొన్నికులములందు దాయభా
గప్రాప్తి స్త్రీసంతానమునకు గలదు. యతికులమున శిష్యులకే కాని తనూజులకులేదు. అ
త్యుపచయము కలవాఁ డెవ్వని కవమానము సేయఁడు. భృత్యావరోధము రాజునేదండిం
చుటవంటిది. రతికాలంబునను మంత్రానుష్ఠానసమయంబును హోమము సేయుతఱిని భో
జనము సేయువేళను నెవ్వనిని నెవ్వఁడును సమీపింపరాదు. ఎంతపరిచయమున్నను జతు
లయందైన విశ్వాసముంచరాదు. మత్తదంతి నెక్కినఁ బ్రాణాపాయము వచ్చును. అతి
వినోదమంగభంగముఁ గావింపక తీరదు. ఆస్తిలేనివాని ఋణమును బరిచర్యచేయించు
కొని తీర్చుకొనవలెను. యతులయెడను బ్రాహ్మణులయెడను క్షత్రియులయెడను పూ
ర్వోక్తవిధి తగదు ఆశనము నెడలను శయనము నెడలను యథాలాభసంతుష్టి లేనివాని
కిఁ దనయాత్మయే వైరి. మహామునివలె సర్వాన్నములు తించు సర్వక్లేశము లనుభవించు
చు సర్వప్రదేశములందు శయనించువాని కసాధ్యమగునది లేదు. ఆడుదానియనురాగ
మువలె సంపద యెవ్వరికిని స్థిరము కాదు. అన్యులమీఁది తంత్రములు చెప్పువారు రా
జులకు ప్రియముగ నిష్టులగుచుందురు. నీచుఁడు పరనిందచే స్వోత్కర్షఁగాఁ దలఁ
చును. అల్పత్వబృహత్త్వములు గుణమువలనం దెలియఁదగుఁ గాని పదార్థప్రమాణమువల
నఁ దెలియవు. కలుషమనీషులు నిర్నిమిత్తముగా మహాత్ములుగారు. ప్రకృతిచే శీతల
మగు జలము సైతముష్ణమగుట వహ్నిప్రభావము. చిరకాలస్థాయియైనను గార్యార్థి లె
స్సఁగా నారాధింపవలెను. కాని యార్థికవ్యవహారముం జేయరాదు. శుభాశుభకర్మ
ములు రెండును సత్పురుష పురస్సరముగాఁ జేయువానికి నాపదలును నపవాదలును రా
వు. సంపదలలో సంపదలును విపదలలో విపత్తులును వచ్చుచుండును. దుష్టాధికారియుఁ
గార్యాధికారియుఁ బరసంబాధమును విచారింపఁడు. శాస్త్రవేత్తలును స్త్రీలును ననుభూతగు
ణులై పరమాత్మను రంజింపఁజేయుదురు గాని ప్రసిద్ధిలో వాఁకిఁబనిలేదు. చిత్రగతుం
డగు రాజాంగుండ దిరస్కరింపరాదు. క్షత్రియతేజము గొప్ప ఘనగనదేవత. యనఁద

